# జమీన్ రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



అధికారం కోసం కీచులాటలతో

## కాంగ్రెస్‌కు పాడెకడుతున్నారు!

రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీకి పాడెకట్టి, సమాధి చేయడం మీదుగా దహనక్రియలు జరపడానికి ఇటు సమ్మతి, అటు అసమ్మతి వాదులిద్దరూ పోటీలు పడి పనిచేస్తున్నారు. అధికారం కాపాడుకోవాలనే తపనలో వీరు, అధికారాన్ని దౌర్జన్యంగానైనా పెరుక్కోవాలనే తాపత్రయంలో వారు పార్టీని భ్రష్టు పట్టించేస్తున్నారు. 17 తేది జరిగిన పార్టీ లెజిస్లేచర్ల సమావేశం ఈ పరిస్థితికి అద్దం పట్టింది.

దాన్ని లెజిస్లేచర్ పార్టీ సమావేశం అనడం కంటే, లెజిస్లేచర్ల వీరావేశ ప్రదర్శనాక్షేత్రమనడం సబబు. జనార్దన రెడ్డి పట్ల ఆగ్రహావేశంతో నున్న ఎమ్మెల్యేలు, జనార్దనరెడ్డి మెప్పుపొందాలనుకునే మంత్రులు కలిసి ఆ సమావేశాన్ని తమతమ బల ప్రదర్శనకు వాడుకున్నారు. రెండు పక్షాలూ సమావేశానికి రాకముందే అమీతుమీ తేల్చుకోవాలనే పథకాలు రచించుకున్నారు. ఈ ప్రమాదం పసిగట్టిన ఢిల్లీ పెద్దలు, అసమ్మతి నాయకులకు ఫోన్ చేసి, తిట్టుకుంటే తిట్టుకున్నారుగాని పత్రికలకెక్కవద్దు అని హుకుం జారీ చేశారు. కాని అది తాటాకు చప్పుడే అయింది. తిట్టుకోవడంతో పాటు, కొట్టుకొనేదాకా పోయిన కాంగ్రెస్ వాదులు, సమావేశంలోని ప్రతి సంఘటననూ పసందైన సినిమా కథ మాదిరి పత్రికల వారికివర్ణించి చెప్పారు.

గ్రానైట్ భూముల కేటాయింపుపై అసమ్మతి వాదులు జనార్దనరెడ్డి పై విరుచుకు పడ్డారు.

**సంచలనం కలిగించిన**
**సి.ఎల్.పి.సమావేశం**

అప్పటికే ముఖ్యమంత్రి సమావేశం మొదట్లోనే ఈ భూములు ప్రతిపక్షాలు రచ్చ చేసినంత విలువైనవేమీ కావని, ప్రతిపక్షాలతో గొంతుకలిపి అసత్యాలను ప్రచారం చేయడం వల్ల పార్టీ భ్రష్టు పట్టిపోతున్నదని విన్నవించారు. కాని అసమ్మతి వాదులు విన్పించుకోలేదు. మాకు వ్యతిరేకంగా మీరు పత్రికా ప్రకటనలిప్పించినప్పుడు, మేము చేస్తేతప్పా అనివారు ఎదురు ప్రశ్నవేశారు. వాదోపవాదాల అనంతరం మంత్రి దామోదర రెడ్డి కుర్చీ ఎత్తి ఒక శాసన సభ్యుడ్ని కొట్టబోయాడట. అందరూ కలసి ఆయన్ను శాంతింపచేశారు.

సుభాష్ చంద్ర బోస్, సుధాకర రావు, జీవన్ రెడ్డి, వంగవీటి చంపతి రావు వంటి వారంతా ముఖ్యమంత్రిపై ప్రత్యక్షంగా దాడికి తలపడ్డారు.

రచ్చయి తప్ప ఈ సమావేశం వల్ల జరిగిన మేలు శూన్యం. ముఖ్యమంత్రిని భ్రష్టుపట్టించ దానికి, రాజకీయంగా ఇరికించ దానికి అసమ్మతీయులు చేసిన ప్రయత్నం సఫలం కాలేదు. ప్రత్యర్థుల ప్రసంగాంలో తప్పులు దొర్లనిచ్చి, హఠాత్తుగా రాజీనామా అస్త్రం ప్రయోగించి, తన అనుకూలురచేత వద్దన్పించుకొని, జనార్దనరెడ్డి పదవీ గండం నుంచి తప్పించుకున్నారు. తాత్కాలికంగా ఆయనకు ఉపశమనం లభించింది.

కొరవ II పేజీలో

# మా నర్మద మొదటి డ్రా కి ఆహ్వానము

## నర్మద ఫిక్స్‌డ్ డిపాజిట్ స్కీమ్

మొట్ట మొదటి డ్రా తే 21.9.91ది శనివారము సా॥ 6గం॥లకు

ఇందిరాభవన్ నందు జరుగును. అందరూ ఆహ్వానితులే.

ముఖ్యఅతిథులు

**Sri. S. Gurumurthy Reddy B.E**

S.E. (A.P.S.E.B,) Nellore

**Sri. M. Zuber**

Regional Manager Weston Electronics Ltd,

6 p.m సాంస్కృతిక కార్యక్రమాలు

7 p.m డ్రా

నర్మద ఫైనాన్స్
29 ఏ.సి. బిల్డింగ్స్
ట్రంక్ రోడ్, నెల్లూరు.

భాగస్థులు

1. శింగారెడ్డి నరసింహారెడ్డి
   నిర్మల ఏజన్సీస్
2. పలగాటి శ్రీనివాసులురెడ్డి B.A.B.L
   నిర్మల ఫైనాన్స్
3. గుబ్బ వెంకటసుబ్బారావు
4. మజ్జిగ రవిశేఖర్ రెడ్డి B.Com
5. పొన్నపోలు దయాకర్‌రెడ్డి B.Com
6. వైదుల వెంకటేశ్వర్లు రెడ్డి
7. ధర్మవరపు రాజమోహన్ రెడ్డి
8. పొన్నపోలు శ్రీనివాసులురెడ్డి
9. అల్లారెడ్డి రమణమ్మ

## WITH BEST COMPLIMENTS

1. P. Rajgopal Reddy KORA, Nellore
2. Samanthula Sridhar Reddy, James garden,Nellore
3. P. Ananda Kumar Reddy Sri Sai Ram Hirers, Dargamitta, Nellore
4. Kanupoor Mohan Reddy, Kanapoor Hari Babu Reddy Opp: Nippo Factory, Nellore
5. Karampudi Anji Reddy , Near Nippo Factory, Nellore
6. Rami Reddy Dasaradha Rami Reddy M.D Bharat Chemicals Company, Hyderabad
7. Ravi Raj Financiers Subedar Pet Nellore.
8. Sannapu Reddi Srinivasulu Reddy, Chinthopu, Nellore.
9. Sai Cafe, T.Ramprasad, Trunk Road, Nellore.
10. Lashmi Weights, and Measures Stone House Pet, Nellore.
11. V.Srinivasulu Reddy B.E ,Vegaru Constructions,T.Road,Nellore
12. P. Srinath, LCE, AMIE. Creations Creations, Kapu Street, Nellore
13. E. Polaiah Centring, PWD Office Centre Nellore
14. P.Srinivasulu Reddy D.C, Tractor supplier, A.C. Vihar Lodge Centre, Nellore.
15. N. Muni Sekar, Geetha Arts , Santhapet, Nellore
16. O.Venkata Reddy Centring, Pusuthota, Nellore.
17. K. Madhan Mohan, Madhu Contractors, Mulumadi Bus stand, Nellore.

## జమీన్‌రైతు

# ప్రధాని ఆవేదన

ఆంధ్ర రాష్ట్ర రాజకీయ పరిణామాలపై ప్రధానమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు వ్యక్తంచేసిన ఆవేదన సముచితమైనది, సమంజసమైనది. పదేళ్ళ అరణ్య వాస శిక్ష తర్వాత రాష్ట్ర ప్రజలు కాంగ్రెస్‌కు తిరిగి పట్టం కట్టబెడితే, దాన్ని సద్వినియోగం చేసుకోవడం చేతకాక, చేసిన తప్పులే మళ్ళీ మళ్ళీ చేస్తున్న నాయకుల తీరు ప్రధానికే కాదు-ప్రతి కాంగ్రెస్ అభిమానికీ కలవరం కలుగుస్తున్నది, హృదయతాపం కల్గిస్తున్నది.

కాంగ్రెస్‌కు అధికారం పునఃప్రాప్తించి రెండేళ్ళు కూడా కాలేదు, అప్పుడే ఇద్దరు ముఖ్యమంత్రులు మారారు. మూడవ మార్పుకోసం ఎదురు చూస్తున్నారు. ఈ రెండేళ్ళ వ్యవధి రాజకీయపరమైన కార్యకలాపాలతోనే గడచిపోయింది. ప్రజల సమస్యలు ఏవీ ప్రభుత్వం పట్టించుకోలేదు. ఏ సమస్యలను పరిష్కరించలేకపోయాడన్న కినుకతో ప్రజలు ఎన్.టి.రామారావును కూలద్రోసి కాంగ్రెస్‌కు పట్టం గట్టారో, అవే సమస్యలు మరింత ఉధృతరూపంలో ప్రజలను బాధిస్తున్నాయిప్పుడు. నక్సలైట్ల సమస్యనే తీసుకోండి, ఒకటి రెండు కిడ్నాపులకే తెలుగుదేశం ప్రభుత్వ అసమర్ధతను అవహేళన చేశారు నాడు; ఈ రోజు తెలంగాణా జిల్లాలలో కిడ్నాప్‌లు సర్వసాధారణ విషయాలైపోయాయి.

రామగుండం వంటి పట్టణాలు పూర్తిగా తీవ్రవాదుల వశమైపోయాయి. వారు చెప్తేనే ప్రజలు వీధుల్లో తిరగాలి; అంగళ్ళు తెరవాలి; ప్రభుత్వ రెసిడెన్షియల్ స్కూళ్ళు, కాలేజీలలో టీచర్లను ప్రక్కకునెట్టి, నక్సలైట్లు తమ సిద్ధాంతాలు బోధిస్తున్నారు. పోలీసు స్టేషన్లకు వచ్చి, మాట్లాడిపోతున్నారు.

కరెంటు కోత విషయంలోనూ కాంగ్రెస్ ప్రభుత్వాలు అణుమాత్రం శ్రద్ధతీసుకోవడం లేదు. ప్రైవేటు రంగంలో కాని, ప్రభుత్వ రంగంలో కాని ఒక్క అదనపు యూనిట్ విద్యుత్‌ను ఉత్పత్తి చేయడానికి రాష్ట్రప్రభుత్వం ప్రయత్నించడం లేదు. విద్యుదుత్పత్తి క్షణాలలో జరిగేపనికాదు; కనీసం నాలు గైదేళ్ళు పడుతుంది. ప్రాజెక్టు కట్టి, కరెంటు తయారు చేయడానికి. ఈ రెండేళ్ళలో ఈ విషయంలో చిత్తశుద్ధితో పనిచేసి వుంటే 1995 లో ఓట్లకోసం తిరిగి ప్రజల వద్దకు పోయేటప్పుడు, ఇదిగో ఈ ఐదేళ్ళలో మేము మీకోసం ఈ అభివృద్ధి సాధించాం అని చెప్పుకోవడానికి వీలయ్యేది. కాని ఇప్పుడు ఆ అవకాశం లేకుండా చేసారు మన నాయకులు.

ఇంకొకప్రక్క అవినీతి, ఆశ్రిత పక్షపాతం, బంధుప్రీతి వగైరా దుర్లక్షణాలన్నీ ప్రభుత్వాన్ని చీడపురుగుల మాదిరి ఆశ్రయించాయి. ప్రభుత్వ నేతల అలుసు చూసుకొని అధికారులు ఇష్టారాజ్యంగా ప్రవర్తిస్తున్నారు. మరొక ప్రక్క పార్టీలో అసమ్మతి పరిధులు దాటిపోతున్నది. శాసనసభ్యులు తాము బజారున పడి, పార్టీని వీధుల పాల్జేస్తున్నారు. ముఖ్యమంత్రి ఉన్న సమయమంతా వీరిని సముదాయించడానికి, ఇళ్ళ స్థలాలవంటి ఆశలు చూపి బుజ్జగించడానికి సరిపోతున్నది. అసెంబ్లీలో కూడా అవినీతి ఆరోపణలపై తప్ప, ప్రజల సమస్యలపై చర్చ జరగడం లేదు

. ప్రజలలో కాంగ్రెస్ పట్ల, ప్రభుత్వం పట్ల విశ్వాసం సన్నగిల్లుతూంది. కాంగ్రెస్‌కు ఓటు వేసి పొరపాటు చేశామేమోనన్న అభిప్రాయం ప్రబలుతూంది. ప్రభుత్వాధినేతలు, పార్టీ పెద్దలు కళ్ళు తెరచి ఈ వాస్తవాలు గ్రహించకుంటే; సమర్ధవంతమైన, నిజాయితీతో కూడిన పరిపాలనను అందివ్వ కుంటే; అవినీతి, ఆశ్రిత పక్షపాతాలను అదుపులో పెట్టకుంటే కాంగ్రెస్ పార్టీ మరొకసారి భూస్థాపిత మైపోతుంది; ప్రజల ఆగ్రహానికి గురౌతుంది.



## జమీన్‌రైతు

19-9-41

10 పేజీలు : అణా

నెల్లూరుపాలెం.

శ్రోత్రియందారు గారి తల మనిషి, అందరి పొగుబళ్ళకు వరదిన నీళ్ళను తమపొగుపూర్తికానిదే యితరులకు వదలము అని చెపుతున్నాడట. ఒకవేళ అధికారముండని అలా దుర్వినియోగం చేయకూడదండీ!

-ఒక రైతు.

కేటాంబోర్డు

కొత్తప్రెసిడెంటు వచ్చిన తర్వాత, టీపాలు పెంక్కు పోవడం, కొందరు నౌకర్లు నిల్చి పోవడం జరిగింది.

ఆఫీసు వేరే యింట్లో పెట్టారు. ఇంటి బాడుగలని, గుమస్తా జీతాలని, ఏమేమో వింటున్నాము. ఓ బ్రదర్! ఈ [illegible] ప్రయత్నం. [illegible] తెల్పుకోవలెను.

పురిటే

అశ్వత్థయ్య ఉపన్యాసాలు
బేడా పావలా ఉపన్యాసాలు

ఈ గ్రామంలో అశ్వత్థయ్య అనే అద్భుత వ్యక్తి వున్నారు. ఆయన [illegible] బోర్డులో [illegible]

**50 ఏళ్ళ క్రితం**

**ఈవారం**

[illegible] తర్వాత [illegible] ముందు [illegible] రైతులకిచ్చే ఉపన్యాసాలకూర్చి వ్రాస్తాను, విత్తనిండి

రైతులు ఇలా బేడా పావలా ఇస్తే వాటిని చేర్చి నీటి దేవతలను పూజిస్తే అధిపొందిన నీళ్లు యిస్తవి అని [illegible] చేయుటకు ఆ దేవతలు ఆగ్రహంలో నీళ్ళు [illegible] శుద్ధి [illegible] చెప్తుచున్నారు.

సత్యాగ్రహ వార్తలు

నెల్లూరు సత్యాగ్రహుల విడుదల

శ్రీ ఓరుగంటి వెంకట సుబ్బయ్య గారు 9 తేది కాకుమన్నురామరెడ్డి, కొల్లపేని వెంకటకృష్ణ స్వామి చౌదరి గారలు 17 తేది, కొనిదా సుందరయ్య 18 తేది విడుదల కాబడిరి.

మైపాడు నక్కలాలయి

రెడ్డి యువకులు వేసిన నాటకం చప్పగా కాదు చిరుచేదుగా కూడా వుంది. పాత యువకులు 17 తేది యువకులు 17 తేది వేసిన నక్కలాయి కమ్మగా వుంది. రెడ్డి యువకులకు పెద్దవారి ప్రోత్సాహం, సహకారం రెండూ లేవు. పాత యువకులకు వారి పెద్దల ప్రోత్సాహం, ఆదరం, అభిమానం అన్ని వున్నవి. అదే విశేషత్వం.

# చుండూరుపుండుమాన్పండి

చుండూరు దురంతంపై ఇటు ఆందోళన కారుల లోనూ, అటు ప్రభుత్వ ప్రవర్తనపైనూ ఆందోళన కల్గిస్తున్నాయి. సమస్యకు సానుకూలం పరిష్కారం కల్పించడం పోయి, సమస్య స్వరూపాన్నే మార్చి వేస్తున్నారు.

చుండూరులో జరిగింది కేవలం కుల పరమైన విద్వేషమే తప్ప, వర్గ వైషమ్యాలు కారణం కాదు. అణగారిన కులం సభ్యులు సామాజిక న్యాయం సాధించామని చెప్పడానికి, లేదా సాధించడానికి చేసిన ప్రయత్నంలో అగ్రకులాలవారి ఆగ్రహానికి గురి కావడమే ఈ ఘోరానికి కారణమన్న సంగతి అందరికీ తెలిసిందే! సమాజంలో సముచితస్థానం పొందడానికి బడుగు వర్గాల వారు చేసే ప్రతి ప్రయత్నమూ ఇటువంటి ప్రతిఘటనలకు గురికావడం సహజం. దళిత నాయకులు కాని ప్రభుత్వనేతలు కాని దళితుల సంక్షేమం పట్ల చిత్తశుద్ధి కల్గినవారైతే, అణగారిన కులాల ప్రజలు ఇటు వంటి ప్రతిబంధకాలను అధిగమించి తమ న్యాయ పోరాటాన్ని ముందుకు కొన సాగించేందుకు సహకరించాలి.

కాని వీరిద్దరూ ఈ దుర్ఘటన విషయంలో ప్రవర్తిస్తున్న తీరు బడుగువర్గాలకు, అగ్రవర్ణాలకు మధ్య శాశ్వత వైరాన్ని పురికొల్పేదిగా, అంతరాన్ని పెంచేదిగా వుంది. భవిష్యత్‌లో ఇటువంటి ఘోరాలు పునరావృతం కాకుండా రెండు వర్గాలలోను సామాజిక చైతన్యం, పరస్పర సామరస్య దృక్పథం, సమస్యలపట్ల సరైన అవగాహన కల్పించవలసింది పోయి, రాజకీయ ప్రయోజనాల కోసం రెచ్చగొడుతు న్నారు. అతిపిగాని కోర్కెలు కోరి దళిత నాయకులు ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెడుతుంటే, దమననీతి ద్వారా ఉద్యమాన్ని అణచడానికి పోలీసులను ప్రయోగిస్తున్నది. ఈ ధోరణుల వలన ఒక్క చుండూరులోనే కాక మొత్తం రాష్ట్రంలోనే హరిజనులు, హరిజనేతరుల మధ్య మానసికంగా ఎడబాటు కల్గే ప్రమాదం ఏర్పడు తున్నది. సమాజంలోనే విషబీజాలు పడుతున్నాయి. ఈ కలుషిత వాతావరణం ప్రమాదకరంగా పరిణమించక ముందే ఉభయవర్గాలూ కలిసి ఉనుకొని, రాజకీయ నిప్పుపెట్టుగాడను త్రిప్పి కొట్టకుంటే నష్టపోయేది ప్రజలు.

నెల్లూరు. -ఆర్.వి. రామిరెడ్డి.

అభినందనీయం

తన కుమారునికి ఇచ్చిన గ్రానైట్ భూములను తిరిగి ప్రభుత్వానికి స్వాధీనం చేయాలని ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్ధనరెడ్డి తీసుకున్న నిర్ణయం అభినందనీయమైనది. రాజకీయాలలో ఉన్నత విలువలను, నైతిక ప్రమాణాలను కాపాడే నిర్ణయం ఇది.

## జనవాణి

జనార్ధనరెడ్డిగారు భవిష్యత్‌లో ఇటు వంటి ఆరోపణలకు తావివ్వకుండా ప్రవర్తిస్తారని ఆశిస్తున్నాను.

కావలి వి.వి. నరసింహాచార్యులు.

వజ్రోత్సవ సంచిక
ఎన్‌సైక్లోపెడియా!

జమీన్‌రైతు వజ్రోత్సవ సంచిక నిజంగా విశేష సంచికే, ఒక కళాఖండం అంటే బాగుంటుందేమో! నెల్లూరు జిల్లాకు సంబంధించిన అన్ని విషయాలు, వాటి పుట్టు పూర్వోత్తరాలతో సహా పొందుపరచారు. ఇది ఈ జిల్లాకు సంబంధించి ఒక ఎన్‌సైక్లోపెడియా.

ఈ సంచికలో నెల్లూరు సినిమాలకు సంబంధించిన వ్యాసంలో వ్యక్తియ

కొరవ 10 పేజీలో

# రష్యాచీలిక ప్రభావం మనపైఎట్లావుంటుందో?

ఒక సమైక్య దేశంగా సోవియట్ రష్యా మనుగడ పరిసమాప్తి చెందింది. ఒక ఉత్తమ రాజకీయ సిద్ధాంతంగా కమ్యూనిజం ప్రపంచ ప్రజల విశ్వాసం కోల్పోతుంది. ఒక ఉత్తమ సాంఘిక విధానంగా సోషలిజం ప్రతిష్ఠ తెరిగిపోతుంది. ఒక ఆదర్శ మూర్తిగా లెనిన్ మహాశయుడి యశస్సు క్షీణించి పోయింది. యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్ అంతరించి పోయింది. ప్రపంచంలో కమ్యూనిజం వ్యాప్తికి ఫుల్‌స్టాప్ పడింది.

20 వ శతాబ్దంలో రెండు చరిత్రలు సృష్టించిన ఘనత రష్యన్‌లే స్వీకరించారు. శతాబ్దపు ప్రథమార్థంలో మహావిప్లవం ద్వారా విశ్వమానవాళి శ్రేయస్సు కోసం సోషలిజం కంచుకోటలను కూలద్రోసి నూతన సాంఘిక, ఆర్థిక, రాజకీయ. పరిపాలనా వ్యవస్థను నెలకొల్పిన కీర్తి రష్యన్‌లదే; ఈ శతాబ్దపు పూర్వార్థంలో ప్రపంచానికి ప్రజాస్వామ్యమనే పెట్టుబడదారీ విధానమే శరణ్యమని చాటిచెప్పిన ఘనత కూడా రష్యన్‌లదే ! కమ్యూనిజంతో 70 ఏళ్ళ పాటు వారు చేసిన ప్రయోగం అత్యంత విషాదకర వైఫల్యాన్ని చవిచూసింది. భవిష్యత్‌లో మరే దేశమూ, మరే ప్రజ మరొక సారి ఈ ప్రయోగం చేయడానికి సాహసించని రీతిలో గుణపాఠం నేర్పారు రష్యన్‌లు. ప్రజాస్వామ్య మహా సముద్రంలో ద్వీపం వలె మిగిలిన చైనా, క్యూబాలు ఎంతో కాలం ఒడిసి కట్ట లేరని లో మనుగడ సాగించలేవు. ఆ దేశం ప్రజలే ప్రజాస్వామ్య ఉద్యమాన్ని ఉప్పెనగా మార్చి ఆ రెండింటినీ ఏదో ఒకనాడు ముంచి వేస్తారు. ఆ రోజు ఎంతో దూరంలో లేదు.

రష్యా పరిణామాల ప్రభావం భారత దేశంపై పడి తీరుతుంది. అదీ ఒకరకంగా ఒక రూపంలో కూడా కాదు. ఆర్థిక, సామాజిక, రాజకీయాల పరంగా వివిధ కోణాలనుంచి వివిధ రూపాలలో వుంటుందీ ప్రభావం.

రష్యా భారత దేశాల మధ్య వాణిజ్య సంబంధాలు పెనుమార్పులకు గురౌతాయిప్పుడు రూపాయి మారకద్రవ్యంతో వ్యాపారం చేసే అతి కొద్ది విదేశాలలో రష్యా ఒకటి. పెట్రోలు సైతం మనం వారినుంచి రూపాయలు చెల్లించి ఎగుమతి చేసుకుంటున్నాం. నాణ్యతలేని ఎన్నో వస్తువులను వారికి ఎగుమతి చేస్తున్నాం. ఇప్పుడాలావాదేవీలు నిల్చిపోతాయి. పాశ్చాత్యదేశాలు పోటీలు పడి రష్యన్ రిపబ్లిక్‌లకు సాయం చేస్తుండడంతో మన ఎగుమతులకు విలువ వుండదు; దిగుమతులకు రూపాయి చెల్లదు.

సైనిక పరంగా మన మింత కాలం పొందుతుండిన మద్దతు ఇక ఆశించలేము. ఇది అత్యంతల ప్రమాదకరమైన పరిణామం. పాకిస్తాన్, చైనా వంటి దేశాలు మనపైకి ఇంతకాలం దురాక్రమణ చేయడానికి సాహసించని

కొరవ 10 పేజీలో

## సింహపురి

### సంస్కృత భాషా దినోత్సవం

నెల్లూరు వేద సంస్కృత కళాశాలలో ఆగస్ట్ 25తేది సంస్కృత భాషా దినోత్సవం జరిగింది. రిటైర్డ్ ప్రిన్సిపాల్ శ్రీ కె.ఎస్. రామానుజాచార్యులు మానవుడి సర్వ అవసరాలకు భావాలకు అనుగుణంగా మలుచుకోవడానికి సంస్కృతం ఉపయోగపడుతుందన్నారు. శ్రీ రాజశేఖరం సభనధ్యక్షించారు. కొందరు విద్యార్థినీ విద్యార్థులు సంస్కృతంలో ప్రసంగించారు. విద్యార్థుల తరపున శ్రీ ఐ.ఉమాశంకర్ స్వాగతం చెప్పారు.

కొరవ 8 పేజీలో

# పోతన కవిత్వం ఆపాత మధురం

గతవారం కొరవ

రెండవ పండుగ భాగవతంలోని మహాదానవ్రతం గురించిన ఉపన్యాసం. ఇది ఆరవతారీఖున సాయంత్రం ఆరున్నర గంటలకు ప్రారంభమయింది. ఈరోజు సభ ప్రారంభమయ్యాక . సన్మాన కార్య క్రమం ముగిసి, ఉపన్యాసం మొదలు కాగానే విద్యుత్ సరఫరా ఆగిపోయింది. క్రితంరోజు అనుభవంతో ముందు జాగ్రత్త చర్యగా పెట్రోమాక్సులైటు ఒక దానిని ఏర్పాటు చేసి ఉంచారు.వేదిక దిగివచ్చి. పెట్రమాక్సులైటు వెలుగులో తన ప్రసంగం కొనసాగించారు. గురు ప్రసాదరావు గారు పోతన జయంతి సభాపోషకులు శ్రీ పంచాగ్నుల జానకిరామయ్యగారు శ్రీ నాగళ్ల గురుప్రసాదరావును సన్మానించారు. పోతన జయంతి సందర్భంగా పోతన కవితాకళపై ఉపన్యసించారు శ్రీ నాగళ్లవారు.

వాల్మీకి కవి సంస్కృతంలో వ్రాసిన భాగవతానికి తెలుగు అనువాదం అయినా . అవసరమైన చోట్ల స్వతంత్రించి , తన స్వంత పద్యాలను వ్రాసి , మూలానికి మరింత ప్రకాశాన్ని మాధుర్యాన్నీ కలిగించారు పోతన కవి. పాత్రల వ్యక్తిత్వాన్ని సుస్పష్టం చేస్తూ, పాత్రోచితంగా సంభాషణలను సహజంగా సరళంగా ఆపాత మధురంగా రచించారు. పోతన ఆయన కవితాకళను విశదీకరించేందుకు నాగళ్ల గురుప్రసాదరావు స్వీకరించిన మహోత్తమ గాధ బలిచక్రవర్తి వామనునికి మూడడుగుల నేలను దానంగా యిచ్చిన ఘట్టం. బలి చక్రవర్తి వద్దకు వామనుని రాక, వారిరువురి సంభాషణ, వామనుని జవాబులోని శ్లేష, దానిని అర్థంచేసికొని బలిచక్రవర్తి దానవాగ్దానం, శుక్రుని వారింపు, శుక్రునికి బలిచక్రవర్తికి జరిగిన సంభాషణ అన్నీ కథాక్రమంగా కథాగమనానికి తోడ్పడుతూ ఉత్కంఠను

## సాహిత్యసభలు

రేకెత్తించిన విధానం పోతన కవితాశక్తిని , ఊహాశక్తిని. ఎలావివరిస్తాయో తెలియజేశారు నాగళ్ల గురుప్రసాదరావు గారు. చివరగా వామనుడు త్రివిక్రముడై ముల్లోకాలను ఆక్రమించినపుడు భూమి యొక్క పరిణామం క్రమంగా చిన్నదౌతూ ఆఖరికి మహావిష్ణువు పాదపీఠమైన తామర పూరేకుకు

కొరవ 12 పేజీలో



44వ స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా " ప్రభాత్ ఇంగ్లీష్ మీడియం స్కూలు బారెక్స్‌లో పతాకావిష్కరణ చేస్తున్న ప్రిన్సిపాల్ వై.వి.కృష్ణయ్య ఉపాధ్యాయ, విద్యార్థినీ, విద్యార్థులు.

# 'జగద్ధితము' - నన్నయ!

(జమీన్‌రైతు పాఠకుల్లో సాహిత్యాభిలాష గలవారి నిమిత్తం పనిగట్టుకొని ఓ 15 లఘు వ్యాసాని కలను "కవుల పలుకులు" శీర్షిక పేరిట వ్రాసి వుంచాను. కవుల పలుకులు అలతి అలతిగా కనిపించినా త్రవ్విన కొద్దీ మహాద్భుతంగా గోచరించే అమూల్య ఖనిజాలు. ఈ శీర్షికలో నన్నయ నుండి నారాయణ రెడ్డి గారి వరకు ఓ పదిహేను మంది కవులను (తొమ్మిది మంది పూర్వకవులు కాగా ఆరుగురు ఆధునిక కవులు) ఎన్నుకొని వారు వాడిన ఒకానొక శబ్దమో, సమాసమో, ఒక వాక్యమో తీసుకొని ఆసందర్భాన్ని ఎరుక పరుస్తూ ఆ పలుకు ఎందుకు కలకాలం జ్ఞప్తికి వుంచుకోవాలో విశదీకరించాను.)

పైన చెప్పిన రెండుపద్యాలలోను " జగద్ధితంబుగన్ " అన్న మాట చివరి మాటగా రావడం గమనించదగ్గ విశేషం. కేవలం పద్యపూరణార్థం ప్రయోగించ బడిన మాటగాదు. ఆ మహాకవుడు మనసారా నమ్మి, తెలిసి తెలిసి ప్రయోగించిన మాట. లలిత కావ్యాల ద్వారా అందినా మహా-

## కవుల పలుకులు

రసిక్

కావ్యాల ద్వారా జగత్తునకేదైనా శ్రేయస్సు కదా హితము చేకూరుతున్న దన్నది ఆలో-చించదగ్గ విషయం. హితము చేకూర్చేదే కదా " సంహిత " అన్న పదానికి సార్థకత.

" సారమతిం..... " అన్న పద్యంలో పై ప్రశ్నకు నన్నయ కొంత జవాబు చెప్పారు. తన రచన లోని " ప్రసన్న కథా కలితార్థ యుక్తి " ( ప్రసన్నంగా జాలు వారే కథలో కూడిన అర్థ యుక్తి) ని కవీంద్రులు మెచ్చుకోటంట (నిజంగానే 'విశ్వనాథ' నన్నయ పేర్కొన్న కవీంద్రులలో అగ్రగణ్యుడు), ఇతరులు (అంటే

కొరవ 11 పేజీలో

# వెంకటగిరిమండలాఫీసు పరువు వీధుల పాలైంది!




వెంకటగిరి మండల ప్రజా పరిషత్ ఆఫీసు ముదనష్టంగా తయారౌతుంది. అమ్మ అబ్బ లేని అనాధగా మారుతూంది.

ఈ ఎంపిపి కార్యాలయానికి చాలా కాలం నుంచి రెగ్యులర్ ఎండిఓ లేడు. కృష్ణయ్య అనే అధికారిని ఇన్ ఛార్జిగా పెట్టారు. ఆయనకసలు కార్యాలయంపై అదుపు లేదు. మొన్నొక రోజు కాశిరాజు అనే అయ్యవారు ఆయన్ని నడివీధిలో నిలిపి కొట్టాడట. కారణం తెలియదు. ఇద్దరి మధ్య జరిగిన ఘర్షణ పోలీసు వరకు వెళ్ళింది. ఆ అయ్యవార్ని అరెస్ట్ చేసి, బెయిల్ పై వదిలిపెట్టారు. సస్పెండ్ కూడా చేశారు.

ఈ గందరగోళంలో పాపమా ఇన్ ఛార్జి ఎండిఓ ఇంక అక్కడ పనిచేయలేక సెలవు పెట్టి వెళ్లిపోయాడట. కొత్తగా ఎవరూ ఛార్జి తీసుకోలేదు. తలలేని మొండెం మాదిరి వుంది మండలాఫీసు ఇప్పుడు! సిబ్బందికి జీతాలిచ్చేవారు కూడాలేరు. ఎక్కడి కాగితాలక్కడే నిల్చిపోయాయి. పనులన్నీ స్తంభించి పోయాయి. మండలాధ్యక్షులవారూ, మీరైనా జోక్యం చేసుకొని మీ ఇంటిని చక్కదిద్దుకో కూడదా?

# పాములకెలవైన గూడూరు పార్కు!

## గూడూరు పార్కు దుస్థితి !

గూడూరు లో మునిసిపల్ పార్కు ఆలనా పాలనా లేక దుస్థితిలో ఉందని గూడూరు మునిసిపల్ కౌన్సిలర్ శ్రీ కె. వెంకట సుబ్బయ్య, గూడూరు టౌన్ టి.డి.పి.కార్యదర్శి శ్రీ కె. ప్రభాకర రెడ్డి ఒక ప్రకటనలో పేర్కొన్నారు.

ధర్మరాజుల స్వామి దేవాలయానికి సమీపంలోవున్న ఈ పార్కు పరిస్థితిని పట్టించుకొనే నాథుడు లేక మోకాలు లోతు గడ్డి పెరిగి పాములు, తేళ్లకు నిలయమై పోయింది.

పార్కులోని పట్టణప్రజలకు ఎంతో ఉపయోగకరమైన 'సైరన్' చెడిపోయి రెండు సంవత్సరాలైందని ఈ సైరన్ మైకా కంపెనీలలో, నిమ్మకాయ మండీలలోనూ, ఇతర సంస్థలలో నూ పని చేసే కార్మికులకు ఎంతో ఉపయోగంగా ఉండిందని వారన్నారు. ఇకపోతే రీడింగు రూము పరిస్థితి యింతకంటే భిన్నంగా లేదని, రీడింగు రూము అటెండరు తన విధులకు సక్రమంగా హాజరు కాడని, దినపత్రికలు చదవటానికొచ్చిన వారినిపరుషంగా మాట్లాడుతాడని వారారోపిస్తున్నారు.

అధికారులు ఈ పార్కును సందర్శించి, సమస్యల పరిష్కారం విషయంలో చొరవ తీసుకోవాలని వారాప్రకటనలో విజ్ఞప్తి చేశారు.

# మురుగళ్ళ స్కూలుకు టీచర్ల భిక్ష పెట్టండి!

## హెడ్మాష్టర్ లేని మురుగళ్ల హైస్కూలు

ఆత్మకూరు మండలం మురుగళ్ల జి.ప్ర.ప హైస్కూలుకు హెడ్మాష్టరేలేడు. తాలూకాలోనే ఉత్తమ పాఠశాల ఇది. ఐదారు సంవత్సరాలనుంచి పదవ తరగతిలో మంచి ఫలితాలు వస్తున్నాయి. గత సంవత్సరం నూటికి నూరుశాతం ఫలితాలు సాధించారు. చదువు బాగా చెప్తున్నారనే ప్రచారం జరగడంతో చుట్టుప్రక్కల గ్రామాల విద్యార్థులందరూ ఈ స్కూలులోనే చేరుతున్నారు. దీనితో విద్యార్థుల సంఖ్య పెరిగి పోతున్నది.

విద్యార్థుల సంఖ్య పెరగడమే తప్ప, అయ్యవార్ల సంఖ్య మాత్రం పెరగడం లేదు. ఉండేది ఆరుగురు టీచర్లు; అందులో ఒకరు అక్షరాస్యతా కార్యక్రమానికి అంకితమై పోయారు. ఐదుగురు ఉపాధ్యాయులతో ఇంత పెద్ద పాఠశాల నడపడం కష్టంగా వుంది. పైపెచ్చు మొదటినుంచి ఈ స్కూలుకు హెడ్మాష్టరే లేడు. ఇన్ ఛార్జిలతోనే బండినడుస్తోంది. మంచి హెడ్మాష్టర్ను, తగినంత మంది టీచర్లను నియమిస్తే తప్ప ఫలితాల సాధనలో స్కూలుకు వున్న మంచిపేరు నిలబెట్టడం కష్టం. హెడ్మాష్టర్ తో పాటు కనీసం ఒక సోషల్ స్టడీస్ టీచర్ నైనా వెంటనే నియమించాలని ఆ గ్రామస్తుడు, అభ్యుదయ భావాలు కల్గిన యువకుడు శ్రీ వి.వి. రఘురామమూర్తి కోరుతున్నారు.

## అయ్యవార్లు లేకుండా వృత్తి విద్యాస్కూళ్లెందుకు ?

సరైన ఉపాధ్యాయుడు లేక రాపూరు వృత్తి విద్యాపాఠశాల నిరుపయోగమై పోతున్నదని ఒక విద్యార్థిమాని వ్రాస్తున్నాడు. రాపూరు స్కూలులో ఐదేళ్ళ క్రితం ఈ వృత్తి విద్యా కోర్సు ప్రారంభించారు. వైరింగ్, సైకిల్ రిపేరింగ్, రేడియో, టి.వి. మెకానిజం, వ్యవసాయోపకరణాల మరమ్మతు వంటివి ఈ కోర్సు క్రింద నేర్పాలని ఉద్దేశం. లక్ష రూపాయల ఖరీదు చేసే పరికరాలు కూడా సరఫరా చేశారు. అయితే ఈ శిక్షణ నివ్వడానికి తగిన ఉపాధ్యాయుణ్ని నియమించలేదు. రు 600 ం కన్సాలిడేటెడ్ జీతంతో ఒక అయ్యవారిని పెట్టారు కాని ఆయనకు జీతం కూడా ఇవ్వడం లేదు. సర్వీసు రెగ్యులరైజ్ చేయలేదు.

జిల్లా లోని 15 వృత్తి విద్యా స్కూళ్ళ పరిస్థితి ఇదే. ఫలితంగా లక్షల రూపాయల విలువ చేసే వర్క్ షాప్లన్నీ వృధాగా పడివున్నాయి. సదాశయంతో ప్రారంభించే సంక్షేమ కార్యక్రమాలు ఆచరణలో చిత్తశుద్ధి లేనందు వల్ల ఇట్లా విఫలం అవుతుంటాయి.

## వెంకటగిరి తపాలా ఉద్యోగుల సభ

అఖిల భారత తంతి తపాలా ఉద్యోగుల సంఘం గూడూరు డివిజన్ సభ ఈనెల 15న వెంకటగిరిలో జరిగింది.

అపరిష్కృతంగా ఉన్న పోస్టలు ఇ.డి ఉద్యోగుల సమస్యలను పరిష్కరించక పోయినట్లయితే నవంబరులో నిరవధిక సమ్మె చేయాలని రాష్ట్ర సంఘం అధ్యక్షులు డి.రామ సుబ్బా రెడ్డి పిలుపునిచ్చారు. సభకు శ్రీ వి నరసింహం అధ్యక్షత వహించగా శ్రీ.కె.మునికన్న వందన సమర్పణ చేశారు.

## అక్టోబరు 4 నుంచి కసుమూరు దుర్గా ఉరుసు

నెల్లూరు జిల్లాలో నేగాక రాష్ట్రం

కారు 11 పేజిలో

# నెల్లూరు గుచ్చెత్తులు
## విమర్శకుడు

### చింతామోహన్ అపూర్వ వైద్యసేవ

కేంద్ర ఎరువులు,రసాయనాలమంత్రి చింతామోహన్ తన నియోజక వర్గ ప్రజలకు అరుదైన,అపూర్వమైన వైద్యసేవ అంద జేస్తున్నారు. ఎరువుల మంత్రిత్వ శాఖక్రిందకు వచ్చే అనేకానేక సంస్థలలో 'క్రిబ్కో' అనే ప్రభుత్వరంగ కార్పొరేషన్ ఒకటి వుంది. గ్రామీణులకు రైతాంగానికి సేవచేసే సహకార సంస్థ ఇది.ఇటువంటి సంస్థ ఒకటి వుందని కూడా ఇంతకాలం మనకు తెలియనే తెలియదు.ఈ సంస్థ ద్వారా చింతామోహన్ నాయుడుపేటలో 19వతేదీ ఒక వైద్యశిబిరం నిర్వహింప చేశారు. శిబిరంలోకి వచ్చిన రోగులందరికి డాక్టర్లు డయాగ్నోసిస్‌చేశారు. చికిత్స అవసరమైన వారిని ఎంపికచేసి నెల్లూరు అపోలో, మద్రాసు ప్రభుత్వాస్పత్రి వంటి ఆధునిక వైద్య సదుపాయాలు,పరికరాలు వున్నచోట ,' క్రిబ్కో' ఖర్చుతో ఉచితంగా చికిత్స చేయిస్తారు. దాదాపు కోటిరూపాయల వరకు వెచ్చించడానికి క్రిబ్కో సంసిద్ధతవ్యక్తం చేసింది. నియోజక వర్గప్రజలకు తన మంత్రిత్వంద్వారా చింతామోహన్ చెల్లించిన తొలి రుణం ఇది. ఇదే సంస్థద్వారా వెంకటగిరి, సూళ్ళూరు పేటల లోని పల్లెగ్రామాలలో పేదలకు విద్య,వైద్యం, నీటిపారుదలగృహవసతి స్కాలర్‌షిప్‌ వంటి సౌకర్యాలు కల్పించ డానికి పదాయికోట్ల రూపాయలతో మరోక పథకం సిద్ధమౌతున్నది.కలెక్టర్ కె.రాజా ఈ పథకానికి రూపకల్ప.

తనుపొందిన మంత్రిత్వ భాగ్యాన్ని ప్రజల మేలుకు ఒక సాధనంగా మలుస్తున్న చింతామోహన్ అభినంద నీయుడు.

19వతేదీ ఉదయం ఆయన నాయుడుపేటకు వచ్చి వైద్యశిబిరంతో పాటు 'చెరిషెస్' ఎక్స్టెంషన్.సెంటరు సదస్సును ప్రారంభించి వెళ్ళారు.



### సుందరరామి రెడ్డి

రాష్ట్ర ఆర్థిక సంస్థ (ఎస్.ఎఫ్.సి.)ఛైర్మన్ హోదాలో ఆత్మకూరు ఎమ్మెల్యే డాక్టరు బి.సుందరరామిరెడ్డి 12వ తేదీ నెల్లూరు వచ్చారు.నెల్లూరులో .ఆత్మకూ రులోకూడా ఆయనకు ఘనస్వాగతం లభించింది.ఆత్మకూరులో అయితే సన్మానం కూడాచేశారు.ఎస్.ఎఫ్.సి చిన్న,మధ్యతరగతి పారిశ్రామికుల పాలిట కల్పతరువుగా మారుస్తానని హామీఇచ్చారాయన.

### పార్లమెంట్‌లో మాగుంట ప్రసంగం

ఒంగోలు పార్లమెంట్ సభ్యుడు శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి తొలిసారిగా 12 తేది లోకసభలో ప్రసంగించాడు. బడ్జెట సంబంధితమైన ఫైనాన్స్ బిల్లుపై ఆయన సుదీర్ఘోపన్యాసం చేశాడు. నల్లధనం, ఆదాయంపన్ను, బ్యాంకు అప్పుల ఎగవేత, కస్టమ్స్ సుంకాలు తదితర అంశాలన్ని ఆయన ప్రసంగంలో చోటుచేసుకున్నాయి.

ఎన్నికైన తొలిసారి, తొలి సమావేశంలోనే లోకసభ సభ్యుడు సభలో బడ్జెట్‌పై ప్రసంగం చేయడం విశేషం. ఉపన్యాస వివరాలు మరువారం ప్రచురిస్తాము

### ఏసి వర్ధంతి అన్నదానం

నెల్లూరు ప్రజల హృదయాలలో శాశ్వత స్థానం సంపాదించుకున్న నేత, మహామనిషి స్వర్గీయ ఏసి. సుబ్బారెడ్డి 24 వర్ధంతి, 20తేది ఉదయం నిరాడంబరంగా జరిగింది. సాధారణంగా శ్రీ ఆనంవివేకానందరెడ్డి ఏసివర్ధంతిని ఘనంగా జరిపేవాడు. సభ జరిపేది. అయితే వర్ధంతి కంటే జయంతి జరపడం సముచితమని అందరూ సూచించడం వలన, ఈ ఏడాది నుండి వర్ధంతి కార్యక్రమాన్ని అన్నదానంతో పరిమితం చేశారు. సభ,రైతు సత్కారం జయంతి నాడు జరుగుతాయి.

20 తేదిఉదయం ఏసి పటానికి శ్రీ పుట్టా బలరామ రెడ్డి పూలమాలవేసి శ్రద్ధాంజలి ఘటించారు. అన్నదాన కార్యక్రమాన్ని శ్రీ ఆనం వివేకానందరెడ్డి ప్రారంభించారు. ఆనం రామనారాయణరెడ్డి, చాట్ల నరసింహారావు, తుమ్మల సుబ్బారెడ్డి, హాజీ మహమ్మ హైదర్ తదితరులు భోజనాలు వడ్డించారు.

### రవీంద్రరెడ్డి కి డాక్టరేట్



నెల్లూరు వి.ఆర్ కాలేజి కామర్స్ లెక్చరర్ శ్రీ పెళ్లకూరు రవీంద్రరెడ్డి కి వెంకటేశ్వర విశ్వ విద్యాలయం పిహెచ్‌డి ప్రదానం చేసింది. నెల్లూరు టౌన్ కార్మిక సంఘాల తీరుతెన్నులపై ఆయన సమర్పించిన పరిశోధనా పత్రానికి ఈ డాక్టరేట్ ఇచ్చారు.

విద్య, విద్యేతర వ్యాపకాలతో ఎప్పుడూ క్షణం తీరిక లేకుండా వుండే రవీంద్ర రెడ్డి ఈ పరిశోధన కొన సాగించడం డాక్టరేట్ పొందడం నిజంగా విచిత్రమే. ఆయనకు మా అభినందనలు.

కొరవ 7 పేజీలో





# శ్రద్ధాంజలి

మాఅభివృద్ధికి కారకుడు, సౌమ్యుడు

## ముంగమూరు బలరామరెడ్డి గారు

(విజయగోపాలపురం - నెల్లూరు)

14-9-91 తేది శనివారం ఆకస్మికంగా మాకు దూరమై నారు.

వారి ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థిసున్నాము

- బంధుమిత్రులు

# రాజీవ్ విగ్రహ ప్రహసనం— ఎందుకీ రోత పనులు ?

నర్తకి సినిమాహాలు దగ్గర,రావ్వవర్తి రామసుబ్బయ్య వీధిలో రాజీవ్‌గాంధి విగ్రహం నెలకొల్పడానికి యువ కాంగ్రెస్ వాది కె.విజయకుమార్‌రెడ్డి చేసిన ప్రయత్నం వికటమైంది. అదే సమయంలో రాజీవ్ గాంధిపేరిట కాంగ్రెసుపార్టీకి ఎంత అపకారం జరగాలో అంతాజరిగింది.

రాజీవ్‌గాంధి మరణించిన వెంటనే విజయకుమార్ రెడ్డి,విగ్రహం ప్రతిష్టించబోతున్నట్లు ప్రకటించాడు. మునిసిపల్ కౌన్సిల్‌లో అనుమతికూడా తెచ్చుకున్నాడు.అయితే ఈనిర్ణయంలో డి సి సి తో సహా మరేకాంగ్రెస్ వాయకుడిని సంప్రదించినట్లులేదు. తనంత టతానుగా ఒక కమిటీవేసి,చందాల దండకం ప్రారంభించేశాడు. స్థల నిర్ణయం కూడా తనదే. యూత్ కాంగ్రెస్ రాష్ట్ర అధ్యక్షుడు ఏ సుధీర్ కుమార్ అధ్యంత రపెట్టినా విజయకుమార్ రెడ్డి వినిపించుకోలేదు. తన మానాన తాను ఏర్పాట్లు చేసుకొని పోయాడు.

అయితే నెల్లూరులో నెలకొల్పేరాజీవ్ విగ్రహం ప్రతిష్టాత్మకమైనదిగా వుండాలని ముఖ్యమంత్రి సంకల్పం.ఏసి స్టేడియం దగ్గర అయితే బాగుంటుందని కూడా డిసిసి నిర్ణయించింది. అందువలన ఈ చిన్న విగ్రహం వద్దని జనార్దనరెడ్డి సూచించాడు. వినకపోయేసరికి విగ్రహ ప్రతిష్టాపనకు ఇచ్చిన తీర్మానాన్ని ఉపసంహరించుకోవాలని ప్రభుత్వం ద్వారా ఆదేశాలు ఇప్పించాడు. దీనితో ఇది పెద్ద వివాదమై పోయింది. విజయకుమార్‌రెడ్డి మొండిగా 19వ తేది ఉదయం శంకుస్థాపన జరుగు తుందని ప్రకటించడంతో దాన్ని అడ్డగించడం కోసం పోలీసు పెద్దెత్తున బలగాలను మోహరించింది. ఏసిబాజార్‌లో చెప్పరిను లోదాడికివస్తే జాగ్రత్తపడి పట్టుగా ఏర్పాటు చేశారు. విగ్రహం పెట్టదలచిన స్థలంలో గుడారం వేశారు. ఇటు కనకమహల్ నుంచి,అటు ఏసిబొమ్మ నుంచి ఆర్.ఆర్.వీధినంతటినీ దిగ్బంధనం చేశారు.దోమకూడాలోపలి దూం కుండా కాపలా పెట్టారు.

> పార్టీ పరువు
> బజారు పాలైంది !

విజయకుమార్‌రెడ్డి బృందం ఉదయం 10గంటకు ఇందిరా భవన్‌నుంచి ఊరేగింపుగా బయలుదేరి,కనకమహల్ సెంటర్‌లో బహిరంగ సభపెట్టారు. జనం పల్చనే.ఉపన్యాసాలు మాత్రం దీర్ఘంగా వుండినాయి.తర్వాత పోలీసు వలయాన్ని ఛేదించుకొని శంకుస్థాపన చేయడానికి ప్రయత్నించారు. ఈ ఘర్షణలో పోలీసులపై రాళ్ళు పడాయి.వారు రెచ్చిపోయి లాఠీలకు పనికల్పించారు.విజయకుమారెడ్డితోసహా అందరినీ చితకబాది, వ్యాన్‌లోకి త్రోసి,తీసుక వెళ్ళారు. నల్లపరెడ్డి శ్రీనివాసులరెడ్డి ఇంటి ఎదుట ఆమర్యజరిగిన ఆత్మహుతి డ్రామా ఇక్కడా చేశారు .నటులూ నల్లపరెడ్డి అనుచరులే. పోలీసులు వారిని పట్టుకున్నారు.దానితో ఈనాటకం ముగిసింది. కాంగ్రెస్ పార్టీ పేరిట, రాజీవ్‌గాంధీ పేరిట జరిగిన ఈ ప్రహసనాన్ని చూసి ప్రజలు ఛీకొట్టారు.

అసలు నర్తకి సెంటర్‌లో విగ్రహ ప్రతిష్టాపన వీలయ్యేదికాదు. రోడ్డు క్రింద ఉయ్యాల కాలువ వుంది. పూడ్చివేయడం అసాధ్యం అది తెలిసీ విగ్రహానికి అనుమతి ఇచ్చిన మునిసిపాలిటీది అసలు తప్పు.ఇదొక రాజకీయరగడగామారుతుందని తెలిసినా చైర్మన్‌గారు విగ్రహం పెట్టడం కోసం ఏసిపార్కు గోడలు తొలగించారు; పోలీసు సహాయ కేంద్రం కట్టడాన్ని కూల్చిపారేశాడు.స్థలం రెడీచేసి విజయకుమార్‌రెడ్డికి అప్పచెప్పి ,ఆతర్వాత వినోదం చూస్తూవుండిపోయాడు. రమేష్ రెడ్డిని కాపాడడానికి, రాజకీయంగా పెంచడానికి, కృషిచేసినందుకు జనార్దనరెడ్డికి మంచి గుణపాఠమే జరిగింది. చేర్మన్ మొదటే స్థలం స్వాధీనం ,చేయకుండా వుండి వుంటే ,ఇంత రాద్ధాంతమేజరిగేది కాదు.

విజయకుమార్ రెడ్డి జిల్లాలో నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి మద్దతు లోపాటు, హైదరాబాదు నుంచి అసమ్మతి నాయకుల అండకూడా లభించి నట్లయ్యింది.అందువల్లే అంతజోరుగా పోయాడు. ఏదిఏమైనా కాంగ్రెస్‌ను భ్రమ పట్టించేపనులలో కాంగ్రెస్‌వాదులు ఇంత పట్టుదల చూపడం, పంతాలకుపోవడం విచారకరం. తన పేరుతోజరిగిన ఈరభసచూసి రాజీవ్ ఆత్మ ఎంత క్షోభించి వుంటుందో మరి!

## నెల్లూరు ముచ్చట్లు

( 6 పేజీ కొరవ)

### సారాయి వేలం

జిల్లాలో సారాయివేలం పాటలు రెండంటే రెండురోజులలో ముగిశాయి.జిల్లాలోని మొత్తం తొమ్మిది సర్కిళ్ళలో 20కోట్ల 9లక్షల రూపాయలకు కాంట్రాక్టర్లు సారాయి అమ్మకం హక్కులు పాడుకున్నారు.గత సంవత్సరం కంటె ఇది 7శాతం కోటి 40లక్షలు ఎక్కువ. పాటలు రెండంటే రెండు రోజులలో ముగిసిపోయాయి. గత సంవత్సరం పోటీలుపడి, రేట్లు పెంచి పాటలు పాడిన కాంట్రాక్టర్లందరూ నష్టపోవడంతో. ఈ ఏడాది కొత్తవాంవరూ రంగంలోకి రాలేదు. పాతవారే కొద్దికొద్ది రేట్ల తేడాతో సర్కిళ్ళు పంచుకొన్నారు.

### వెంకటగిరి జాతర

వెంకటగిరి పోలేరమ్మజాతర అక్టోబరు 2,3తేదులలో జరుగుతుంది. జాతర నిర్వాహకులు వెంకటగిరి రాజాలే! పోలేరమ్మగుడిని తేసుకోవడానికి ఎండోమెంట్స్‌శాఖ చేసిన ప్రయత్నం ఫలించలేదు.

### ప్రొఫెసర్ గారికి ప్రభుత్వ అవార్డు

వెంకటేశ్వర విశ్వవిద్యాలయం మానవశాస్త్ర విభాగం ప్రొఫెసర్ , డాక్టర్ ఎ. మునిరత్నం రెడ్డి రాష్ట్ర ప్రభుత్వ ఉత్తమ అధ్యాపక అవార్డు పొందారు. ప్రభుత్వ అవార్డు స్వీకరించిన తొలి ప్రొఫెసర్ ఆయనేనట. రాష్ట్రంలో 1951 లో వాకాడు మిషన్ హైస్కూలులో జనార్దనరెడ్డి సైన్సు టీచరుగా పనిచేసినప్పుడు మునిరత్నం రెడ్డి ఆయన విద్యార్థి. ఈ రోజు ఉత్తమ టీచర్‌గా అదే జనార్దన రెడ్డి నుంచి బహుమతి స్వీకరించాడు. మునిరత్నంరెడ్డి వాకాడు మండలం గొల్లపాలెం గ్రామస్తుడు.

### రాస్తారోకో అరెస్టులు

ఎమ్మెల్యేలకు ఇళ్ల స్థలాలు, కార్లకొనుగోలుకు అప్పులు ఇస్తున్నందుకు నిరసనగా శ్రీ ఎల్. రామశివారెడ్డి ఆధ్వర్యంలో 18 తేది ఉదయం దర్గామిట్ట అంబేద్కర్ భవనం సమీపంలో యువజన కాంగ్రెస్ కార్యకర్తలు రాస్తారోకో జరిపారు. 15 నిమిషాల్లోపలే పోలీసులు వచ్చి అందరిని వ్యాన్‌లోకి ఎక్కించి తీసుకువెళ్లారు.

### మరణం

వార్డుమోపూరు మాజీ సర్పంచ్ శ్రీ దేశిరెడ్డి వెంకట శేషారెడ్డి 11తేది ఉదయం అపోలో ఆస్పత్రిలో హృద్రోగంతో మరణించారు. ఆయన వయస్సు 61 సంవత్సరాలు. ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె వున్నారు. సినీ నిర్మాత శ్రీ డి. శివప్రసాద రెడ్డి ఆయన పెద్ద కుమారుడు.

### పీటి మట్టం

| | | |
|---|---|---|
| సోమశిల ( 16 తేది) | 23.4 టి.యం.సి | |
| కండిగిరి రిజర్వాయరు | 9.0 అ. | |
| సర్వేపల్లి రిజర్వాయరు | 4.9 అ. | |
| నెల్లూరు చెరువు | 13.4 అ. | |

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకు 9672 | | 2800/- |
| | 9674 | 2900/- |
| ఐ.ఆర్. 20 | | 2400/- |
| ఐ.ఆర్.64 | | 2300/- |
| సన్నాలు | | 2300/- |
| మొలగొలుకు బియ్యం 70 కి | | 400/- |
| బంగారు సవర(8గ్రా) | | 3240/- |
| వెండి 10గ్రా | | 72/- |

### పోయినవి.

నాతాయాకు డోర్ నెం.17/50 గల తిప్పరాజా వారి వీధిలోని ఇంటి తాలూకూ డాక్యుమెంటు నెం. 23140/1968 గలవి పోయినవి. అవి ఎవరికైనా దొరికిన నాకు చేర్చిన తగు బహుమతి యివ్వగలను. ఆ డాక్యుమెంట్లు వుపయోగించి ఎవరైనా ఏ విధమైన అన్యాక్రాంతము లేక అడుమాన ముంచుకొన్న చెల్ల నేరవు. నేను తీసుకొను సివిల్ క్రిమినల్ చర్యలకు వారే బాధ్యులగుదురు.

డి.వి.కృష్ణారెడ్డి
17/50 తిప్పరాజావారి వీధి
నెల్లూరు.

# శాసన సభలో విమర్శకు నిర్మాతల తాపత్రయం!

భారత్ బంద్ చిత్రం ప్రచారం కోసం నిర్మాతలు పడిన అగచాట్లు అన్నిన్ని కావు. అసెంబ్లీ రౌడీ చిత్రానికి అసెంబ్లీ ద్వారా వచ్చిన ప్రచారాన్ని చూసిన నిర్మాతలు తమ సినిమాను శాసన సభలో విమర్శించమని పలువురు ఎమ్మెల్యేల దగ్గరకు వెళ్లి ప్రాధేయ పడ్డారు. అసెంబ్లీ రౌడీలో హీరోయిన్ వంటి మినిమిని లేవు. రాజకీయ పస అంటూ ఏమీ లేదు. చిత్రం కూడా చెప్పుకో దగ్గది కాదు. కాని అసెంబ్లీలో దానిపై పెద్ద రాద్ధాంతం జరగడంతో విపరీతమైన ప్రచారం జరిగింది. నిర్మాతలు డబ్బు పోసుకున్నారు. అది చూసిన భారత్‌బంద్ నిర్మాతలకూ నోరు ఊర ఊర లాడింది. ఎందరో ఎమ్మెల్యేలను వీరు కాళ్ళవేళ్ళా పడ్డారు. తెలిసిన వారందరి చేత చెప్పించారు. పలుకుబడి ఉపయోగించారు. కొందరు సభ్యులకు రహస్యంగా పార్టీ ఇస్తామని కూడా ఆశ పెట్టారని వదంతి.

కాని వారి ఆశ నిరాశ అయింది. వీరి పలుకుబడులకు, ప్రలోభాలకు ఏ శాసన సభ్యుడూ లొంగలేదు. నెగటివ్ పబ్లిసిటీ ఆశ తీరనే లేదు. అయితే అసెంబ్లీ రౌడీ అంత బ్రహ్మాండంగా కాకపోయినా, భారత్ బంద్ బాగానే ఆడుతూంది. అది కొంత ఊరట.

## సామ్రాట్ అశోక్

బ్రహ్మర్షి విశ్వామిత్ర తర్వాత తెలుగు దేశం అధినేత తదుపరి చిత్రం, 'సామ్రాట్ అశోక్' నిర్మాణం సెప్టెంబరు 12తేది ప్రారంభమైంది. విశ్వామిత్రకు వచ్చిన విపరీత ప్రచారం ఆ సినిమాను పతనం చేయడంతో, ఈ సారి సందడి లేకుండా షూటింగ్ ప్రారంభించాడు - ఎన్.టి.రామారావు. తమ స్వంత స్టూడియోలో, పరిమిత సంఖ్యలో హాజరైన కుటుంబ సభ్యుల సమక్షంలో నిరాడంబరంగా జరిగి పోయింది. కార్యక్రమం, ఎన్.టి.రామారావు ఇందులో చాణక్యుడిగా నటిస్తున్నారు. బాలకృష్ణ అశోకుడి పాత్ర ధారణతో పాటు దర్శకత్వం కూడా వహిస్తున్నాడు.

## మద్రాసు సినిమావార్తలు

విశ్వామిత్ర పరాజయం సెంటిమెంటే, బాలకృష్ణ దర్శకత్వానికి కారణం. లేకుంటే ఎన్.టి. రామారావు ఈ బాధ్యతను కొడుకుకి అప్ప చెప్పేవాడు కాడు. కథ, స్క్రీన్‌ప్లే మాత్రం ఆయనే సమకూరుస్తున్నాడు.

ప్రతిపక్షంలో వుండడం వల్ల ఇప్పుడు రామారావు గారికి కావలసి నంత తీరిక వుంది. తెలుగు దేశం పనులేకాదు, నేషనల్ ఫ్రంట్ పనులు కూడా ఏవీ లేవిప్పుడు. ఇప్పట్లో ఎన్నికలు వచ్చే సూచనలూ లేవు. అందువల్ల చాలా తీరికగా, శ్రద్ధపెట్టి, షూటింగ్ కార్యక్రమాలు కొనసాగించ వచ్చు. విశ్వామిత్ర వలెనే సామ్రాట్ అశోక సైతం సంవత్సరాల నుంచి నలుగుతుండేది. విశ్వామిత్ర వలె రాజకీయాలతో కలుషితం చేయకుండా ఈ సినిమాను మంచి చారిత్రక కళాఖండం వలె తీర్చిదిద్దు తారని ఆశిద్దాం!

## రాజేంద్ర ప్రసాద్ 'కొబ్బరి బొండాం'

కాట్రగడ్డ రవితేజ దర్శకత్వంలో రూపొందుతున్న "కొబ్బరి బొండాం" చిత్రంలో రాజేంద్ర ప్రసాద్ బొండాం మాదిరే కన్పిస్తాడు. దిండులో దూది కూరినట్లు వంటినిండా మెత్తటి గుడ్డలు పెట్టి, పైన లాక్కావేసి అసలు లావుకి రెండింతలు సైజులో మేకప్ వేశారు. రాజేంద్ర ప్రసాద్‌ను! పాపం ఆ బరువును ఉక్కపోతను భరిస్తూ, నటించడానికి నానాయాతన పడుతున్నాడు! రాజేంద్ర ప్రసాద్.

## చిత్రం కంటే పత్రికే లాభదాయకం

దర్శకుడు, నిర్మాత, రచయిత, నటుడు కె.భాగ్యరాజా ఇటీవల తీసిన రెండు తమిళ చిత్రాలు అంతబాగా ఆడలేదు. దానితో ఆయన సినిమా పత్రిక పెడ్తే లాభసాటిగా ఉంటుందనుకున్నాడేమో - వెంటనే రంగంలోకి దూకాడు. మొదట "ఉదయం" అనే సినిమా పత్రికను తమిళంలో వెలువరిస్తాడట. కొంతకాలం పోయాక తెలుగులో కూడా తీసుకొస్తాడట.

## మీనాక్షిశేషాద్రి, నిర్మాతల మధ్య లడాయి

హిందీలో నిర్మించే "దామిని" చిత్రంలో మన తెలుగు "విశ్వామిత్ర" ఫేమ్ మీనాక్షి శేషాద్రి నాయిక. బొంబాయి ఫిలిమ్ సిటీలో ఆరు లక్షల రూపాయల ఖర్చుతో వేసిన ఒక సెట్‌లో ఆమె నటించడానికి నిరాకరించిందని నిర్మాతలు 'ఫిలిమ్ మేకర్స్ కంబైన్' కు ఫిర్యాదు చేస్తూ, తత్ఫలితంగా తమకు ఎన్నో లక్షల రూపాయలు నష్టం వాటిల్లిందని పేర్కొన్నారు. కానీ, తనను ఆ చిత్రం నుంచి

కొరవ 12 పేజీలో

# రసరమ్యచిత్రం జనరంజకం

# సూర్య ఐ.పి.ఎస్

ఎన్నోముఖములు, అభిరుచులు, కళాపోషణలు, సినిమారంగాలు, రాజకీయ వేదికలు, పారిశ్రామిక విజయాలు, దానధర్మాలు, సాహసవు కీర్తిచంద్రికలు సమ్మేళనం మన తిక్కవరపు సుబ్బరామి రెడ్డి అంతరాత్మను మేలుకొలిపి వీటిని ఆరాధిస్తున్న వ్యక్తి టి. సుబ్బరామి రెడ్డి. మానవత్వంతోపాటు ఆయనలో దైవత్వమూ మిన్నగా వుంది. దైవచింతన ఆయన్ను తిరుపతి దేవస్థానం ఛైర్మన్ పదవికి చేర్చింది. భగవద్గీతను భారతీయభాషలన్నింటిలోను నిర్మించే సదవకాశం కలిగించింది. ఈ ఆధ్యాత్మిక చిత్రాన్ని ప్రపంచ దేశాల్లో వారి వారి భాషల్లో సబ్ టైటిల్స్‌తో విడుదల కాబోతూంది. అందుకే టి. సుబ్బరామి రెడ్డి బహుముఖ ప్రజ్ఞావంతుడు. కార్యసాధనలో సాహసవిక్రమార్కుడు. ఇది అప్పీలు లేని తీర్పు.

టి. సుబ్బరామి రెడ్డి తాజాగా నిర్మించిన "సూర్య, ఐ.పి.యస్." చిత్రం రసరమ్యంగా జనరంజకంగా విజయపథాన పరుగులిస్తున్న సందర్భంగా ఆయన్నుగూర్చి కొంత ప్రస్తుతించవలసి వచ్చింది.

ఎ. కోదండరామి రెడ్డి దర్శకత్వంలో రూపొందించిన ఈ చిత్రంలో ప్రేక్షకులను ఆకట్టుకునే అంశాలు చాలావున్నాయి. చిత్రం మొదటి భాగం చాలా వరకు నేటి రాజకీయ వాతావరణాన్ని, హత్యా రాజకీయాలను చూపుతూ ప్రజల్లో రాజకీయ చైతన్యం సాధించేందుకు ప్రయత్నించాడు దర్శకుడు. రాజకీయపదవిలో వున్న తండ్రి చనిపోతే అతని కుమారునికో, భార్యకో ఆ పదవిని వారసత్వంగా సంక్రమింపచెయ్యటం, అలాగే భర్త చనిపోతే భార్యను ఆ పదవికెక్కించడం, ఓడిపోయిన ఎమ్.ఎల్.ఎ. ను ముఖ్యమంత్రిని చెయ్యటం, పోలీస్ ఉద్యోగిని రాజీనామా చేయించి మంత్రి పదవిని కట్టబెట్టటం, ఇవన్నీ ఈ రోజుల్లో జరుగుతున్న దగుల్బాజీ వ్యవహారాలు. వీటన్నిటిని బాగా దుయ్యబట్టారు. రాజకీయ వాదాడితో చిత్రం పతాకీగా సాగింది.

## చిత్రసమీక్ష

**గ్రిద్దలూరు గోపాలరావు**

చిత్రం రెండవ భాగం ఒక కుటుంబ గాథగా, కొంత రాజకీయ రంగు పులుముకొని రూపుదిద్దుకొంది. ఈ కుటుంబంలో తాత, తండ్రి, మనుమడు ముఖ్యసభ్యులు. ఇందులో తండ్రి తాతను, మనుమడిని నానా హింసలు పెడ్తాడు. మనుమడైన సూర్య(వెంకటేష్) మొదట్లో రాజకీయాల పేరిట జరిగే చేటలోపతి అదుపు తప్పి వుంటాడు. అతన్ని పోలీసు ఆఫీసర్‌ను చేస్తాడు తాత (సత్యనారాయణ). సూర్యతో పాటు అతని ప్రియురాలు శిరీష(విజయశాంతి) కూడా పోలీస్ ఆఫీసరవుతుంది. సూర్య తండ్రి జగదీశ్వరరావు(శరత్‌రాజ్) ముఖ్యమంత్రి అండతో దుండగాలు చేస్తుంటాడు. శిరీష తండ్రిని హత్య చేయిస్తాడు. జగదీశ్వరరావు తన తండ్రేఅయినా అతని దుర్మార్గాలనుండి ప్రజానీకానికి విముక్తి కలిగించటం న్యాయం, సముచిత ధర్మంగా భావిస్తాడు సూర్య. తన తండ్రి మీద, ముఖ్యమంత్రి

కొరవ 12 పేజీలో

# పెండ్లిండ్లు

కుంటిత్వంతో కుర్చీపాలవున్న ఈ రోజులలో దానికి అతీతంగా ఆదర్శంగా, విద్యావంతులు చేయదగిన చేయవలసిన పనిగా జరిగిన వివాహం ఇది. వధూవరుల తల్లి దండ్రులు మూర్ఖంతో, మూఢత్వంతో పంతాలు పట్టింపులతో కాకుండా కాలజ్ఞానులుగా అత్యంత వివేక వంతులుగా ప్రదర్శించి తమనమ్మతితో, తమ ఆశీర్వాదాలతో జరిపించిన కళ్యాణమిది.

అమ్మాయి - కోవూరు వాసి హైకోర్టు న్యాయవాది, స్నేహ సెన్నిధి శ్రీ.పి.కృష్ణారెడ్డి కుమార్తె శారద; కావలి -జీవితాన్నంతా విద్యారంగానికే అంకితం చేసి గవర్నమెంటు డిగ్రీ కాలేజిల ప్రిన్సిపాల్ గా రిటైరై, కావలిలో రావూర్ అకడమిక్స్ పేరుతో ఉన్నత ప్రమాణాలతో వున్నత విద్యాసంస్థను నిర్వహిస్తున్న నిష్కళంక, నిత్యనూతనోత్సాహి శ్రీ వై.వి. చలపతిరావు కుమారుడు రవీంద్ర.

వీరి వివాహం ఆగస్టు 16 తేది తిరుపతి కొండమీద జరిగింది. వెంకటేశ్వరస్వామి పతిసమేతంగా వచ్చి ఈ ఆదర్శదంపతులను దీవించారు. వధూవరులిద్దరూ న్యాయవాదులే కావడం విశేషం.

× × × ×

స్మృతి మారినా మనిషి మారని నిరాడంబరుడు, దైవభక్తి సాహభీతి గలిగిన సాత్విక స్వభావి, పట్టింది బంగారమయ్యే అదృష్ట శాలి,నెల్లూరు "మురళీకృష్ణుడు" గోపాలయ్యతనయ రేవతి; బెంగుళూరు వంవస్మ్యడు శ్రీ.బి.గోపాలశెట్టి కుమారుడు, ఇంజనీరింగ్ పట్ట భద్రుడు వీరభద్రప్ప వివాహం సెప్టంబరు 4 తేది నెల్లూరు టవున్ హాలులో మిత్రజనసందోహంగా వైభవంగా జరిగింది.

× × ×

నెల్లూరు న్యాయవాది శ్రీ జి. రవీంద్ర రెడ్డి సోదరుడు శ్రీనివాసులురెడ్డి - శ్రీలతల పరిణయం సెప్టంబరు 4 తేది నెల్లూరు ఇందిరాభవన్‌లో జరిగింది.

# రష్యా

(4 పేజి కొరవ)

కారణం రష్యా మద్దతే! ఇప్పుడు వారు తటస్థులై పోతే ఆసియా ఖండంలో భారతదేశం ఒంటరిదై పోతుంది. ఈ పరిణామం యావత్ వర్ధమాన దేశాలకూ వర్తిస్తుంది. సైనిక పరంగా రష్యా తటస్థ వైఖరినవలంబిస్తే అమెరికా దురంహాకారానికి పట్టపగ్గాలు లేకుండాపోయే తీరును ఇరాక్ పై జరిగిన యుద్ధంలోనే స్పష్టంగా చూశాం మనం. అమెరికా సైనిక పాటవానికి దీటైన శక్తి ఒక్క రష్యాకే వుంది. అదిప్పుడు నిర్వీర్యం కావడంతో ప్రపంచంలో ఏమూల తన పెత్తనానికి ప్రతిఘటన ఎదురైనా అమెరికా బెత్తం ఝళిపించి లొంగదీసుకుంటుంది. ఈ పరిణామం ఒకనాటి వలస సామ్రాజ్య వాద దుస్థితిని పునరావృతం చేసినా ఆశ్చర్య పడవలసిందేమీ లేదు.

సోవియట్ రష్యా నుంచి దిగుమతి చేసుకున్న ఆయుధాలు, విమానాలకు విడి పరికరాల సరఫరా ఎట్లా వుంటుందో చెప్పలేము. వాటి సరఫరాకు ఆటంకం కల్గితే మన సైనిక శక్తి సగం తుప్పుపట్టిన ఇనుప యంత్రం మాదిరి చతికిల బడిపోతుంది.

రెండు అగ్రరాజ్యాల మధ్య ప్రచ్ఛన్న యుద్ధం జరిగే పరిస్థితులలో ఆవిర్భవించిన అలీన విధానం ఇప్పుడు కాలంచెల్లినదై పోతుంది. అలీన దేశాల నాయకులలో భారతదేశం లోప్రపంచంలో ఇదివరకటి విలువను ఇప్పుడు ఆశించలేము.

ఈ మార్పులన్నీ ఒక ఎత్తయితే సామాజిక పరంగా రష్యాలోని చీలికలు ఇండియాపై ప్రసరించే ప్రభావమే ఎక్కువ, రష్యా వలెనే భారతదేశంలోను విభిన్న జాతులు, విభిన్న మతాలు, విభిన్న భాషలు వున్నాయి. రష్యాలో వలెనే ఇక్కడా నాజాతి, నామతం, నాభాష అన్న వేర్పాటు వాదాలు పెచ్చరిల్లుతున్నాయి. పంజాబ్, అస్సాం, కాశ్మీర్, నాగాలాండ్, మిజోరాం వంటి రాష్ట్రాలలో తీవ్ర వాదుల అంతిమ ధ్యేయం స్వయం ప్రతిపత్తి మాత్రమే. లాటివియా, లిథుయేనియా, ఎస్తోనియ, రిపబ్లిక్‌ల స్వాతంత్ర్య సాధన ఈ తీవ్రవాద ఉద్యమాలను మరింత రెచ్చగొట్టడం, ఉధృతం చేయడానికి పరోక్షంగా ఉపకరించడం సహజం. అందులోనూ ఈ యేడు రిపబ్లిక్ లను గుర్తించడానికి, సహాయపడడానికి పాశ్చాత్యదేశాలు చూపిన ఆతృత మన తీవ్రవాదులలోనూ ఆశలు రేకెత్తించి తీరుతుంది. అది ఎంతటి తీవ్ర పరిణామాలకు దారితీస్తుందో చెప్పనే అవసరం లేదు.

అయితే రష్యాకు, మనకు జాతుల సమస్యకు సంబంధించి చాలా తేడావుంది. స్వాతంత్ర్యోద్యమం, గాంధీజీ వంటి మహానాయకుల కృషి వల్ల భిన్నమతాలు, భాషలు, ఆచారాలు, భౌగోళిక పరిస్థితులు వున్నప్పటికి భారతీయులంతా ఒకే జాతి అన్న భావం ప్రజలలో వుంది. ఒక ప్రాంతం వారిపట్ల ఇంకొకరికి స్నేహ సౌహార్ద సంబంధాలున్నాయి. రష్యాలో పరిస్థితి అదికాదు. 70 ఏళ్ల సోషలిజం వారిలో ఒకేదేశం, ఒకే ప్రజ అన్న ఏకమత్యాన్ని పెంపొందించ లేకపోయింది. ఒక జాతిపట్ల ఇంకొక జాతి ద్వేషభావాలు పెంచుకున్నాయి. శత్రువులుగా చూసుకున్నాయి. అందువలననే అణచివేతనుంచి కొద్ది విడుదల లభించగానే వారు ఎవరి పాటికి వారుగా విడిపోయారు. స్వాతంత్ర్యం ప్రకటించుకున్నారు.

భారత దేశంలో అంతటి ప్రమాదం లేనప్పటికి రష్యా ప్రభావంతో వేర్పాటువాద ఉద్యమాలు బలం పుంజుకొనే అవకాశం మాత్రం వుంది. నాయకులు, ప్రజలు ఈ ప్రమాదాన్ని పసిగట్టి, మొగ్గలోనే త్రుంచి వేసే చర్యలు తీసుకోవలసివుంది.

# జనవాణి

(3 పేజి కొరవ)

ఘంటసాల రాధాకృష్ణయ్య భక్తరామదాసు చిత్రంలో నటించారని వ్రాసారు. కాని ఆసినిమాలో రాధా కృష్ణయ్య వేసింది-కబీరు వేషం; అరటి సత్యనారాయణ రామదాసుగా నటించారు.

మూగ సినిమాలలో నెల్లూరుకు సంబంధించి పి. పుల్లయ్య కంటే ముందుగా వెంకటగిరి వాస్తవ్యులు శ్రీ టి.వి.కె. నాయుడు "మాయామోహనం" అనే మూకీ సినిమాలో హీరోగా నటించారు.

నెల్లూరు -సి. శంకరదాస్,

వజ్రోత్సవ సంచిక ఈ మాసంలో వెలువడుతుందని ఊహించలేక పోయాను. అన్ని కోణాలకు సంబంధించిన వ్యాసాలు అందులో వున్నాయి. జిల్లా సమాగ్రరూపాన్ని పాఠకులకు అందించినందుకు ధన్యవాదాలు.

రావూరు. - బి. వెంకటసుబ్బయ్య

## టౌన్ హాలుకి జనరేటర్

నగరం నడిబొడ్డులో ఉంటూ ఎన్నో రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక, కళా కార్యక్రమాలకు సేవలందించే లక్ష్మి నరసింహారెడ్డి పురమందిరం ( టౌన్ హాలు) లో జనరేటర్ ఈ నాటిముఖ్య అవసరాలలో ఒకటని టౌనుహాలు నిర్వాహకులకు మనవి చేస్తున్నాను.

మైకుకీ, ప్రత్యేక దీపాలంకరణకీ చార్జీ వసూలుచేస్తున్నయాజమాన్యంపై ఆయా కార్యక్రమాలకు నిరంతరాయంగా మైక్, మరియు లైట్లు పనిచేసేట్టు చూచే బాధ్యత గూడా ఉంది. విద్యుత్ శక్తి సరఫరాలో అంతరాయం కలిగినప్పుడు హాలంతా చిమ్మచీకటి ఆవరించడం ఎంతో అసౌకర్యాన్ని కలిగిస్తున్నది. ఎంతో దూరంనుంచి, వ్యయప్రయాస లకు ఓర్చి వచ్చే సాహిత్య ఉపన్యాసకులూ, కళాకారులూ కార్యక్రమానికి విఘాతం ఏర్పడటంతో ఎంతో నిరాశకు గురయ్యేఅవకాశం ఉంది. ఇటీవల టౌనుహాలులో అనవిజ్ఞాన వేదికవారు వేయబూనిన నాటికలు కరెంటులేక అభాసు పాలయ్యాయి. ఈ నెల 5, 6 తేదుల్లో వర్ధమానసమాజం నిర్వహించిన సాహిత్య కార్యక్రమాలలో ఉపన్యాసకులు క్రొవ్వొత్తి వెలుగులో ప్రసంగించవలసి వచ్చింది. ఇది మనసింహపురికి అప్రతిష్ఠ కల్గించే విషయం. పరప్రాంతాల నుండి ఎంతో ఆశతో ఆసక్తితో వచ్చే మహారచయితల పట్ల, కళాకారులపట్ల ఒకవిధంగా అపచారం కూడా. కనుక టౌనుహాల్ యాజమాన్యం వెంటనే విద్యుత్ సరఫరాకు ప్రత్యామ్నాయ మార్గంగా జనరేటర్ ను ఏర్పాటు చేయడం ఎంతైనా అవసరమని మనవి చేస్తున్నాను.

నెల్లూరు సత్యవేటి శ్రీకాంత్

Regd No. H.N.L. 18

# శ్రీ వేణుగోపాలస్వామి దేవస్థానం

## మూలాపేట - నెల్లూరు

# మాగాణిభూమివేలం

కు చెందిన ఎ 6.06 సెంట్లు

మాగాణి భూమిని బహిరంగ వేలములో విక్రయించుటను గురించి :

హైదరాబాద్ ఎండోమెంటు డిపార్టు మెంటు కమీషనర్ గారి ఆర్డరు ఆర్.సి.నెం. డుం 2/ 44075 / 89-1- తేది 19.7.91 ప్రకారము నెల్లూరు జిల్లా నెల్లూరు పట్టణము మూలాపేట శ్రీ వేణుగోపాలస్వామి వారి తాలూకు నెల్లూరు బాలాజీనగర్, హ్యాబిటాస్ కాన్వెంట్ దగ్గర యున్న ఈ క్రింది షెడ్యూలులో తెలిపినట్టి ఎ 6.06 సెంట్లు మాగాణి భూమిని ఎ 3.00 , మరియు ఎ 3.06 సెంట్లుగా 2 ప్లాటులుగా చేసి యున్న భూమిని 10.10.91 తదియం 11.00 గంటలకు గుంటూరు జిల్లా ఎండోమెంటు డిపార్టుమెంటు డిప్యూటీ కమీషనరు గారి సమక్షములో సదరు ప్లాట్లు వుండు ప్రదేశములో పై దేవస్థానము మేనేజింగ్ ధర్మకర్త గారి చే టెండరు కమ్ బహిరంగవేలము ద్వారా విక్రయించబడును.

### సీలు వేయబడిన టెండర్లు ప్రకటనద్వారా పిలుచుటకు నిర్దేశించిన షరతులు:

1. బహిరంగ వేలము పాటలో పాల్గొనదలంచిన వ్యక్తులు ఒక్కొక్క ప్లాటుకు వారి ఆఫర్ తో బాటు రు. 3,00,000/- లు అక్షరముల మూడు లక్షల రూపాయలు ధరావత్తు క్రింద డ్రాఫ్టు రూపముగా తీసుకొని సీలు వేయబడిన టెండరును బహిరంగ వేలము పాటకు ముందుగా స్వయముగా లేదా రిజిస్టరు పోస్టుద్వారా మేనేజింగ్ ధర్మకర్త గారికి అందచేయవలయును. (డిమాండు డ్రాఫ్టు మేనేజింగు ధర్మకర్త, శ్రీ వేణుగోపాలస్వామి దేవస్థానము, మూలాపేట, , నెల్లూరు వారి పేరుతో తీసుకొనవలయును.)

2. బహిరంగవేలము పాట ప్రారంభించేముందు హాజరయిన టెండరుదార్ల సమక్షములో వేలము నిర్వహణాధికారిచే అందిన టెండర్లు తెరువబడును.

3. అట్టి టెండర్లలో అధిక ధరను ఇనిషియల్ బిడ్ మొత్తముగా నిర్ణయించి బహిరంగవేలము ప్రారంభించబడును.

4. టెండరుదార్లే గాక, ఇతరులు కూడా స్థిరాస్తి విక్రయ వేలము పాట షరతులకు లోబడి నిర్ణయించిన రూ. 3,00,000/- లు (అక్షరముల మూడు లక్షల రూపాయలు) ధరావత్తును బహిరంగ వేలము పాటకు ముందు చెల్లించి వేలము పాటలో పాల్గొనవచ్చును.

### బహిరంగవేలము పాట షరతులు

1. ఈ వేలము పాట హిందూదేవాదాయ ధర్మాదాయశాఖ డిప్యూటీ కమీషనరు, గుంటూరు వారి సమక్షములో జరుపబడును.

2. వేలము పాటలో పాల్గొనదలచినవారు పాటకు ముందుగా ఒక్కొక్క ప్లాటుకు రు. 3,00,000/- లు (అక్షరముల మూడు లక్షల రూపాయలు) ధరావత్తు చెల్లించి పాటలో పాల్గొనే నిర్ణయము.

3. హెచ్చు పాటదారు ధరావత్తు తప్ప మిగిలిన వారి ధరావత్తులు పాట ముగిసిన తిరిగి యివ్వబడును. పాటదారులకైన ఏ విధమైన వడ్డీలు యివ్వబడవు.

4. ఆ పాటను దేవాదాయశాఖ కమీషనరు, హైదరాబాదు వారి ఆమోదపు ఉత్తర్వులకు లోబడి హెచ్చు పాటదారుని పేరున ఖాయపరచబడును.

5. పాట అయిన వెంటనే హెచ్చు పాటదారు తన పాట మొత్తములో 1/3 వంతు సొమ్ము దేవస్థానము మేనేజింగు ధర్మకర్త వద్ద డిపాజిట్టు చేయవలయును. ఆ విధముగా చెల్లించని యెడల పాట మొదట చెల్లించిన ధరావత్తు సొమ్మును అపరాధముగా దేవస్థానము జప్తుచేసుకొనుటయేగాక, తిరిగి జరుపబడిన వేలములో వచ్చిన నష్టమును మొదటి హెచ్చు పాటదారునివద్ద నుండి 18 శాతము వడ్డీతో సహా రాబట్టుకొను అధికారము దేవస్థానము వారికి కలదు.

6. హైదరాబాద్ దేవాదాయధర్మాదాయశాఖ కమీషనరు వారి ఆమోదపు ఉత్తర్వులు తెలియపరచిన 15 దినములలో హెచ్చుపాటదారుడు మిగిలిన 2/3 వంతు పాట సొమ్మును (ధరావత్తు సొమ్ము మినహాయించి) పూర్తిగా చెల్లించి తన స్వంత ఖర్చులతో రిజిస్టరు చేయించుకొనవలయును. ఆ విధముగా చెల్లించని యెడల మొదటి పాట ఆఖరున కట్టిన 1/3 వంతు పాట సొమ్మును, ధరావత్తు సొమ్మును అపరాధము క్రింద దేవస్థానము జప్తుచేసుకొనుటయే గాక, తిరిగి పాట పెట్టబడిన వేలములో నష్టము వచ్చిన యెడల సదరు నష్టమును 18 శాతం వడ్డీతోసహా హెచ్చు పాటదారు వద్దనుండి రాబట్టుకొను నిర్ణయము.

7. ఏ కారణము చేతనైనా పాటను ఆపు చేయుటకుగాని వాయిదా వేయుటకు గానీ, కారణము తెలుపకయే నిలిపి వేయుటకుగాని మేనేజింగు ధర్మకర్తగారికి లేదా వేలము పాట నిర్వహించు అధికారికి అధికారము కలదు.

8. హెచ్చుపాటదారుడు ముందే వేలమునకు నిర్దేశించిన స్థిరాస్తిని పరిమితిని, సరిహద్దులను సరిచూసుకొని పాటలో పాల్గొనవలయును. పాట ఖాయపరచిన అనంతరము పై విషయములో ఎట్టి తగాదాలు చేసినను దేవస్థానము వారికి సంబంధములేదు.

9. కమీషనరు, దేవాదాయశాఖ, హైదరాబాద్ వారు స్థిరాస్తి అమ్మకమును తిరస్కరించిన యెడల పాట ఆఖరున హెచ్చు పాటదారు చెల్లించిన 1/3 వంతు సొమ్ము ధరావత్తుతో సహా తిరిగి చెల్లించబడును. అట్టి సొమ్ముకు ఏ విధమయిన వడ్డీ యివ్వబడదు.

10. హెచ్చుపాట దారుడు సబ్ రిజిస్ట్రారు వారు నిర్ణయించిన ధరప్రకారం స్టాంపు డ్యూటీ వగైరాలు చెల్లించి తన స్వంత ఖర్చుతో పాట భూమిని రిజిస్టరు చేయించుకొను నిర్ణయము.

11. స్థిరాస్తి విక్రయ రిజిస్ట్రేషను అయిన వెంటనే కొనుగోలు చేయబడిన ఆస్తిని హెచ్చుపాటదారు నికి స్వాధీనము చేయబడును.

### షెడ్యూలు

| గ్రామము మండలము జిల్లా | ప్లాటు నెం. | సర్వే నెం. | విస్తీర్ణము | భూమి తరహా |
|---|---|---|---|---|
| శ్రీ వేణుగోపాలస్వామి దేవస్థానము, మూలాపేట, నెల్లూరు. | 1 | 862 | ఎ 3.00 | మాగాణి |
| | 2 | 862 | ఎ 3.06 | " |

మజ్జిగ చంద్రమౌళి రెడ్డి, మేనేజింగ్ ట్రస్టీ,

వంశపారంపర్యపు ధర్మకర్తలు,

3. మన్నెం లక్ష్మీనాథ్ రెడ్డి 1. ఆనం వివేకానందరెడ్డి,
4. తుమ్మల సుబ్బారెడ్డి. 2. ఆనం చంద్రశేఖర రెడ్డి,

## సాహిత్యసభలు

( 4 పేజీ తరువాయి)

అంటుకున్న బురదగా మిగిలి పోవడాన్ని వివరించే పద్యాన్ని అమోఘంగా వివరించారు నాగళ్లగురుప్రసాదరావుగారు. దానిపాశ్చాత్య సన్నివేశంగా మలిచి, ఉపన్యాసంముగించి కరతాళధ్వనులు అందుకున్నా రాయన. పై రెండు సభలనూ శ్రీ అన్నపరెడ్డి వెంకురెడ్డి చక్కని ధోరణిలో నిర్వహించి , వందనసమర్పణ గావించారు.

తరువాయి 11 పేజీలో

సినిమా 9వ పేజీ తరువాయి

నిర్మాతలు అర్థాంతరంగా తొలగించి తనపై దబాయించారంతో వృత్తిపరం గా అపారనష్టం కలుగజేశారు గనుక తనకు అగ్రిమెంట్ ప్రకారం చెల్లించాల్సిన పూర్తి మొత్తాన్ని ఇచ్చి తీరాలని మీనాక్షి కేసు పెట్టింది. ఎటూ తేల్చిచెప్పాలో తోచక 'ఫిలిమ్ మేకర్స్ కంబైన్' సభ్యులు ఇరుకున పడ్డారు. ఇటువంటివి సినిమా రంగంలో మామూలే. ఏ సమయంలో ఎవరి మీద ఎవరు ఎందుకు కినుక వహిస్తారో తెలియదు.

### మన్నెంలో మంగమ్మ

'కడప రెడ్డెమ్మ ' బాణిలో ' మన్నెంలో మంగమ్మ ' అనే పేరు పెట్టి, శారదతో ఒక చిత్రం తీయబోతున్నారు. సాయం సీతమ్మ అనే ఒక గిరిజన స్త్రీ యదార్థ జీవిత గాథ ఆధారంగా తీయబోతున్న ఈ సినిమాకుసమర్పకురాలు కూడా శారదే. దవళ సత్యం దర్శకుడు.

చిత్రసమీక్ష 9 వ పేజీ తరువాయి

మీద దండెత్తుతారు. మానవుని ఆవేదనను, ఆర్తిని అర్థంచేసుకొని, న్యాయశాస్త్రాలు పనికి రావు దండుగ అని న్యాయ వ్యవస్థ మీద ఎదురు తిరిగి కత్తిబట్టే హింసాకాండకు దిగుతాడు సూర్య. మొదట్లో ప్రియురాలు శిరీష సూర్యను అపార్థంచేసుకొని అసహ్యించు కున్నా ఆతర్వాత ఆమెకు ఆమనిషిలో దేవుడు కనిపిస్తాడు. అతని మనసులో మమత చిగురించింది. అంతే అతన్ని వెంటనే ప్రేమించేసింది. సూర్య సాగించిన పోరాటంలో దుర్మార్గం ఓడిపోతుంది. ధర్మం గెలుస్తుంది. ఈ లోకపు చీకటి పోగొట్టేందుకు తూరుపు వాకిట సూర్యుని తొలికిరణం పరిచినట్లు, పీడితుల జీవితపు దారుల్లో చీకటి పారద్రోలేందుకు ప్రతి వాకిటా " సూర్య " కిరణం వెలగాలి అన్నది ఈ చిత్రం ఆశయం.

పరుచూరి బ్రదర్స్ వ్రాసిన కథ, మాటలు బాగున్నాయి. ఈ చిత్రంలో మాటలు తక్కువ. నటన, భావప్రకటన ఎక్కువ. మాటలు లేనిచోట దర్శకుని ప్రతిభ చక్కగా కనిపిస్తుంది. సూర్య చిలిపితనం, శిరీషపై అతని ప్రేమ, అతన్ని శిరీష అసహ్యించుకొన్నతీరు చివరకు శిరీషలోని అసహ్యం ప్రేమగా మారిన దృశ్యాలు రసరమ్యంగా చిత్రీకరించారు దర్శకుడు. " యువ్వన మారాజమ్మా " పాటచిత్రీకరణ ఆకర్షణీయంగా వుంది.

వెంకటేష్ నటనలోను, హాస్యంలోనూ, ఫైటింగు ల్లోను ఎంతో చురుగ్గా కనిపించారు. విజయ శాంతి నటన అభినందనీయం.

Edited, Printed and Published by N.Dolendra Prasad at Zamin Ryot Press, Nellore, OFFSET Printing at Nayagara Books Pvt, Ltd, Nellore.